# వీరభద్ర స్తవము

" నమోస్తుతే ఉభయంకరం"

30-12-2007

బ్రహ్మ గర్వ ఖర్వితం-అర్కదంష్ట్ర భంజనం
ఇంద్ర బల విమర్ధనం- దక్షయజ్ఞ ధ్వంసినం
కాల కాలరూపిణం-కాల పాశమోచనం
హృదంతరే నిరంతరం-నమోస్తుతే ఉభయంకరం|| 1

సర్వ రోగ హారిణం-అగ్ని జిహ్వాఖండినం
వీరఖడ్గపాణినం- దక్షశిరసి భేదినం
అఖిల దేవ సేవితం-అరివర్గ మర్ధనం
హృదంతరే నిరంతరం-నమోస్తుతే ఉభయంకరం|| 2

పంచభూతసేవితం-ప్రపంచ రక్ష కారకం
ఆది భిక్షు తేజసం- అఖిల లోక పూజితం
సకల సౌఖ్య దాయకం-సదా భక్త పాలినం
హృదంతరే నిరంతరం-నమోస్తుతే ఉభయంకరం|| 3

దుష్ట గర్వ నాశనం-శిష్ఠరక్ష కారిణం
అంతరిక్ష పాలితం-అంతరంగ సాక్షిణం
సర్వ మంత్ర భావనం-యంత్ర తంత్ర పాలకం
హృదంతరే నిరంతరం-నమోస్తుతే ఉభయంకరం|| 4

మహారౌద్ర రూపిణీ-భద్ర కాళి నాయకం
వీరభద్ర నామకం-సర్వభూతనాయకం
ఆది వైద్య రూపిణం-సుభక్త రక్షదాయకం
హృదంతరే నిరంతరం-నమోస్తుతే ఉభయంకరం|| 5

## 10-01-2008

యజ్ఞేశ్వరునివీడియాగంబుతలబెట్టి
దక్షుండు దర్పించి ధరణిమీద
దక్షయాగముచూడ దాక్షాయిణివెడలె
తనయరాకనుజూచి దక్షుడరిచె
శర్వునినిందించ శర్వాణికినియుచు
తగదీతనువనుచు తగనువిడిచె
రుద్రుండదివినుచురౌద్ర రూపముదాల్చి
చట్రాతిపైనొక జటనుకొట్టె
విద్యుత్ప్రభాభాస విభ్రాజమానమౌ
భద్రుడు జనియించె రౌద్రుడగుచు
భూతగణముకంత నేతగా జేయుచు
దక్షుని దండించ తగనుబంపె
తండ్రియానతిగొనిదక్షాద్వరంబును
ద్వంసంబుజేయగా దండువెడలె

సర్వభూతదమన శరభావతారుడా
యక్ష రక్ష తతుల శిక్షసేయ
యాగశాలకరిగి యడలజేసెనపుడు
విలయకాలరౌద్రు వీరభద్రు ||                    1

ఆకాశమునుయంటు అతిదీర్ఘకాయుండు
శిరస్సుపైనిలబడ్డశిఖలవాడు
ఘనరవనినదంపు కంఠంబుగలవాడు
మేఘఛాయనుబోలుమేనివాడు
నిప్పులు కురిపించు నిడుదయూ ర్పులవాడు
దీర్ఘనాశికతోడ తివురువాడు
కాలనాగునుబోలు కనుబొమకలవాడు
చురకత్తులనుమించుచూపువాడు
మెరుపుతీగెలుబోలు మేనిజందెమువాడు
సరసంపు కోరమీసాలవాడు
ఘనమైనభుజములఘటనంబుగలవాడు
పరశుబాణాసి ్ర్పాణపాణి
అష్టబాహువులందు ఆయుధములవాడు
శత్రుహృదయభేది శౌర్యధారి
అడుగునడుగునందునవనినదరజేయు
గంభీరనడకల గడుసువాడు

భూతప్రేతనికరభూరిభోజనదాత
భద్రకాళిమాత హృదయనేత

ప్రళయరౌద్రరూపుపావకాక్షు
విసుతి సేతు నెపుడు వీరభద్రు || 2

ఆగురా దేవేంద్ర ఆయుధంబేదిరా
అనుచునడలజేసి అణగద్రొక్కి
మహిషవాహననీకు మగటిమి గలదురా
అరచియమునిబట్టి యదరగొట్టి
అగ్నిని శిఖబట్టి యతని నాల్కనుగోసి
సూర్యుని దంతాల నూడబెరికి
రాజరాజునుబట్టి రాజసంబునిదించి
చంద్రునిమెడబట్టి చవటజేసి

నీదువీరతత్వనియతితెల్పితిగాదె
ప్రళయరౌద్రరూప పావకాక్ష
దక్ష గర్వ భంగ దానవ సంహార
విలయకాల రౌద్ర వీరభద్ర || 3

పట్టిసంబునిబట్టి పాపులచెండాడి
మూలదాగినవార్నిముడిచిగొట్టి
భగునికన్నులుపీకి భారతినడలించి
బ్రహ్మనుచెఱబట్టి భంగపరచి
వాయు దేవునిబట్టి వాయినిమూయించి
విష్ణువునదలించి విలువదించి
దక్షశిరసుద్రుంచి దహియించినగ్నిలో

వాటికనంతయువల్లకాడు జేసి

నీదువీరతత్వనియతితెల్పితిగాదె
ప్రళయరౌద్రరూప పావకాక్ష
దక్ష గర్వ భంగ దానవ సంహార
విలయకాల రౌద్ర వీరభద్ర || 4

ఉంకించి నొడలెల్ల హుంకారమునుజేసి
నుర్విభాగమునెల్ల నుడగజేసి
జంకించిమైపెంచి శంఖంబుపూరించి
గగనభాగమునెల్ల కలయతిరిగి
కనపడ్డ నరినెల్ల ఖడ్గంబు కెరవేసి
యజ్ఞవాటికనంత యడలగొట్టి
దక్షునిదండించి తండ్రియానతితీర్చి
కైలాసమునకేగి కలకదీరి

నీదువీరతత్వనియతితెల్పితిగాదె
ప్రళయరౌద్రరూప పావకాక్ష
దక్ష గర్వ భంగ దానవ సంహార
విలయకాల రౌద్ర వీరభద్ర || 5

ఆదివైద్యుడవీవు అభయదాతవునీవు
దుష్టశిక్షుడవీవు శిష్టరక్ష
ఖడ్గంబుచేబట్టి కదనానదూకితె
యెదురునిల్వానునీకు యెవరులేరు
ఛండప్రచండకో దండహస్త విచిత్ర
శస్త్రాస్త్రశాసనా శంభుపుత్ర
సర్వమంత్రములందు సర్వయంత్రములందు
సర్వతంత్రములందు సారమీవె

భద్రకాళిమాతభావజాబ్జపునేత
ప్రళయకాలరౌద్ర పాపనాశ
దక్షయాగభంగ దానవసంహార
విశ్వ శాంతిదాత వీరభద్ర || 6

ఓంనమో వీరాయ ఓంకారరూపాయ
ఉగ్రాయ భీమాయయూర్ధ్వకేశ
వైరిసంహరణాయ వజ్రనఖాగ్రాయ
శిఖినీలకంఠాయ శీఘ్రగమన
శరభాయ భీష్మాయ శంకరపుత్రాయ
శర్వాయ సర్వాయ శస్త్రపాణి
ప్రాణాయ భద్రాయ పంచాక్షరేశాయ
కాలాగ్నినేత్రాయ కాలకాల

సకలపాశమోక్ష శంభుస్వరూపాయ
ప్రళయకాలరౌద్రపాపనాశ
సర్వరోగశమన శరభావతారాయ
విశ్వ శాంతి దాత వీరభద్ర 7

ములుగువారింటికి మూలపుర్షుడవీవు
ముదిగొండ వారింటి మూర్తినీవు
కొడిమేలవారింట కొలువుతీరితివీవు
శివలెంక వారింటి సిద్ధివీవు
ఇవటూరివారింటి యింగితజ్ఞుడవీవు
శ్రీపతిపండిత సిరులు నీవు
మంచనపండితు మాగాణి భూమీవు
పండితారాధ్యుల పంటనీవు
శౌత్రశైవమునందు శ్రోత్రియు లందరి
శ్రేయస్సునిచ్చేటి శ్రేష్టవీవు

సకల వీర శైవ సాంప్రదాయమ్మీవు
విశ్వ వీర నికర వీర్య దాత
విశ్వనాథునాత్మవియదవిహంగమా
విశ్వ శాంతి దాత వీర భద్ర 8

------

మంగళహారతి 1

శ్రీవీరభద్రునకు శ్రీశంభుపుత్రునకు
శ్రీఊర్ధ్వకేశునకు శ్రీకంఠతేజునకు
జయమంగళం నిత్యశుభమంగళం

ఫాలాగ్నినేత్రునకు పట్టిసాయుధునకు
ప్రళయాగ్నిరుద్రునకు ప్రణవస్వరూపునకు
జయమంగళం నిత్యశుభమంగళం

అర్కేన్దునేత్రునకు అభయవరదాతకు
కౌమరౌప్పదేహునకు కోరమీసాలకు
జయమంగళం నిత్యశుభమంగళం

భీకరాకారునకు మహి భీమశబ్దునకు
బాహుబలవీరునకు భవిపాపహరునకు
జయమంగళం నిత్యశుభమంగళం

పరశుగదాబాణాసి పట్టిసాయుధములకు
ముసలముద్గర తోమరాయుధములకు
జయమంగళం నిత్యశుభమంగళం

బలమైన నడుముకు వేలాడుకత్తికి
నూపురమ్ములతోడ నూర్చేటి శక్తునకు
జయమంగళం నిత్యశుభమంగళం

శివద్రోహులనుపట్టిశిక్షించు పదములకు
దక్షశిరఖండునకు దాక్షిణ్యరూపునకు

జయమంగళం నిత్యశుభమంగళం

శరభావతారునకు శరవణునిభ్రాతకు

దివ్యతేజసునకు దివ్యావతారునకు

జయమంగళం నిత్యశుభమంగళం

భక్తవరదాతకు భాగ్యావతారునకు

శ్రీభద్రకాళీహృదయాబ్జభృంగునకు

జయమంగళం నిత్యశుభమంగళం

భూతగణనాధునకు భువివీరభద్రునకు

ములుగు విశ్వనాధారాధ్య నిత్యసేవితునకు

జయమంగళం నిత్యశుభమంగళం

మంగళహారతి 2

నీలకంఠనందనాయ నిత్యమంగళం
బ్రహ్మపుత్రసేవితాయ భవ్యమంగళం
అగ్నిహోత్రలోచనాయ అభయమంగళం
రౌద్రవేషభీషణాయ రమ్యమంగళం
దృప్తసింహవాహనాయ దివ్యమంగళం
భద్రకాళీశ్వరాయ భద్రమంగళం
వీరభద్రేశ్వరాయ విజయమంగళం
మామాకాభీష్టదాయ మహితమంగళం

ఇది

కౌండిన్యసగోత్రోద్భవుండగు ములుగునాగలింగారాధ్య ప్రపౌత్రుండును,
విశ్వనాధారాధ్య పౌత్రుండును, దుర్గాప్రసాదారాధ్యపుత్రుండునుహనుమకొండ
వాస్తవ్యుండును యగు ములుగు విశ్వనాథారాధ్య విరచిత వీరభద్ర స్తవము.

---

వీరభద్ర మంత్రము 1

07-07-2010

బుధవారము

శివశ్రీ శివలెంక అమరేశ్వరంగారు శివలెంక
ప్రభాకర్గారియింటికివచ్చినప్పుడువారినికలయగా
వారుఆశీర్వాదమిచ్చి వారిస్వహస్తములతోవ్రాసి
యిచ్చిన వీరభద్రమంత్రము ఇది

అస్యశ్రీవీరభద్రమంత్రస్యవామదేవఋషి:
త్రిష్టుప్ ఛంద:-వీరభద్రేశ్వరోదేవతా

ఖేం-బీజం,ఫట్-శక్తి:, స్వాహా-కీలకం
ఓంనమోవీరభద్రాయ,వైరినాశాయ,సకలలోక
భయంకరాయ,భీమవేషాయ,హుంఫట్ విజయాయ
సకలరిపూన్ హుంఫట్ స్వాహా= ఇదిమూలమంత్రము

ఓంనమోవీరభద్రాయ అంగుష్ఠాభ్యాంనమ:

వైరినాశాయ తర్జీనీభ్యాంనమ:
సకలలోకభయంకరాయ మధ్యమాభ్యాంనమ:
భీమవేషాయ అనామికాభ్యాంనమ:
హుంపట్ విజయాయ కనిష్ఠకాభ్యాం నమ:
సకలరిపూన్ హుంపట్ స్వాహా కరతలకరపుష్టాభ్యాంనమ:

ఓంనమోవీరభద్రాయ హృదయాయనమ:
వైరినాశాయ శిరసేస్వాహా
సకలలోకభయంకరాయ శిఖాయ వషట్
భీమవేషాయ కవచాయహుం
హుంపట్ విజయాయ నేత్రత్రయాయ వషట్
సకలరిపూన్ హుంపట్ స్వాహా అస్త్రాయపట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధ:

2 వమంత్రము

ఆకాశ భైరవ తంత్రము నుండి గ్రహించినది
*సృంఖం విద్వేష హననాయ వీరభద్రాయ ఖడ్గహం హ్రీం
దక్ష ధ్వంసనాయ ద్రాం హ్రోం రరరర హుంఫట్ స్వాహా॥ *
ఈ మంత్రము 1008 సార్లు జపించిన సిద్ధించును.
దీనికి న్యాసాదులు చెప్పబడలేదు. శతృబాధా
నివారణార్థమై రోజుజపించవలయునని

మాత్రమే తెలుపబడినది.

3 వ మంత్రము

ఇది శివశ్రీ చాగంటిభాస్కరలింగశాస్త్రి గారిచే సంగ్రహించి ముద్రించబడిన వీరభద్ర స్తోత్ర సముచ్చయము యను గ్రంధము లోనిది.

మంత్రము=

ఓం వీరభద్రాయ, దక్షసంహరణాయ, ఆపదుద్ధరణాయ,ఈశ్వరపుత్రాయ, ప్రళయకాలాగ్నిరుద్రావతారాయ, నారసింహసంహరణాయ, ఓం ఫట్ స్వాహా ల,ల,ల,లి,లి,లి,ఓం. అఘోరవీరభద్రాయనమ:, ఓం ఫట్ స్వాహా

(ఆకాశ భైరవ కల్పే)

*ములుగు విశ్వనాథ శర్మ*

*హనుమకొండ 8-9-10.*

---